# సన్నాహం

నా ఆత్మ చెమరించింది
కారు మేఘాల కావం
సంధ్యాకాంతి వాతావరణంలో—
నా చుట్టూ
ఏడు పూవులు పూశాయి—
ఒక్కటొక్కటిగా
అవి నన్ను తమలోకి ముడుచుకున్నవి
వాటి దివ్య సుగంధతుషారాన్ని
నాకు అందినవి—
అపుడు నాకు కాంతి సాక్షాత్కరిస్తూ ఉంది—
నాకు కన్నీళ్ళు లేవు—
దేదీప్యమానమైన వారిలోని ప్రశాంత విక్రాంతి
ఆ పూలను పులకింప చేస్తూ ఉంటే
అవి మళ్ళీ మళ్ళీ వికసించాయి—
ఒక నాకలోక బృందం నాకు దారి చూపించింది
నిర్ణీత దిశలో—
అక్కడ, క్రొవ్వత్తి దీపాలు కరిగిపోయేదాక
కనిపెట్టుకొని ఉన్నాం — ఆ తర్వాత
"విధేయతే అహంకు అంత్యక్రియ" అనే
ప్రబోధ ప్రవచనాన్ని నాలో నిక్షిప్తం చేసి
వారు నన్ను ఆ క్రొవ్వత్తులతో కలిపి కప్పేశారు—
అనంత కాలంలో మూటగట్టి
సుగంధ ధూపంలో వేణుగాన మాధుర్యంలో
నా ఆత్మను నాట్య మాడించారు
వాధ్యావరోధాన్ని కాల్చివేస్తున్న జ్వాలికనిపించేదాక—
అర్ధ స్వప్నావస్థలో
ఒక పిండంగా నన్ను నా తల్లిగర్భంలో ఉంచారు—
అఖండ ప్రభాకలిత జ్యోతిని వారు అవలికి తోసేదాక
నాకక్కడ మట్టి ఆశ్రయ మిచ్చింది.

## THE HORSE

From a height with self-confidence.
A horseman came riding as
In a majestic parade, ruling his horse,
Seated as though on a throne.
The splended white horse, galloping.
Dashed from afar—with loyalty—
Even in the storm.
Carrying his honor on his back.

In silent admiration, my eyes
Followed horse and rider.
Matured desire raised me to a height.
To create my horse of life—
To restrain and ride with confidence
That the running miles of this world
Be my conquered land.

## అశ్వం

ఉన్నతోన్నత శిఖరం నుంచి
ఆత్మవిశ్వాసంతో
అశ్వికుడొకడు అరుదెంచాడు.
రాజవీధి ప్రదర్శనలో
తన అశ్వాన్ని
అదుపులో పెట్టి నడుపుతూ
సింహాసనం మీద కూర్చున్నట్లు
ఆ గుర్రం మీద కూర్చుని నవ్వాడు.
అద్భుతమైన ఆ శ్వేతాశ్వం
దౌడు తీస్తూ
దశ్వ్యలనుంచి దూసుకొని వచ్చింది.
సంక్షోభ వాతావరణంలో కూడ
స్వామిభక్తిని ప్రదర్శిస్తూ
అతని ప్రతిష్ఠను
తన వీపు మీద నిలబెట్టింది.

విశృంఖల విహారజీవనం సలుపుతూ
ఆ అశ్వాన్ని అశ్వికుణ్ణి
నా కళ్ళు అనుసరించాయి.
పరిపక్వమైన వాంఛ
నన్ను ఒక ఔన్నత్యానికి లేవనెత్తింది
నా జీవితాశ్వాన్ని సృష్టించుకోవడం కోసం
నిగ్రహంతో ఆత్మవిశ్వాసంతో
దానిపై స్వారీచేస్తూ చేరినంత దూరం
ఈ లోకం
నా దిగ్విజయసీమగా చేసుకోవడం కోసం.

## THE MOVING BREATH AND BRUSH

In my veins,
It drizzles
The light
Which reposes
In darkness ;
And my spirit
As a love traveller.
Meets with beauty
Face to face,
Which takes birth
Every second
From her
By inhaling
The eternal essence
Of creativity
That brings forth
Two loves,
Absolute,
And follows
Their impulsion
Toward the unfathomed.
To be a mother
And a poet,
By their labors'
Burning desires.
The tears I shed
For them
Spray life on the world,
Perpetually
Turning the wheel of light,
Portraying
The moving brush
And breath of the sublime
Where I release
The body and words
Of the soul and nature
In that communion
Which is acceptance
From the league
Whose source
Is the limit,
As a mother,
As a poet.

# చైతన్య వర్ణవాక్ చిత్రాలు

నా రక్తనాళాల్లో
జల్లుగా కురుస్తున్న వెలుగు
చీకటితో విక్రమిస్తున్నది;
నా ఆత్మ
ప్రేమ యాత్రికురాలై
సౌందర్యాన్ని ముఖాముఖి కలిసికొంటున్నది;
ఆ సౌందర్యం
శాశ్వత సృజనశక్తిసారాన్ని పీల్చుకుంటూ
అనుక్షణం ఆమెలోనే ఆవిర్భవిస్తున్నది—
ఆ సృజన శక్తి
రెండు నిరపేక్ష సంపూర్ణ ప్రేమలను సృష్టిస్తుంది;
శ్రమోజ్జ్వలిత వాంఛలతో
ఒక తల్లిగా-ఒక కవిగా మారిపోవాలనే
వాటి నిగూఢ గాంభీర్యమయమైన
మహోగతిని అనుసరిస్తుంది.
వాటికోసం నేను కార్చే కన్నీరు
ఈ లోకం మీద జీవన శిఖరాల చల్లుతుంది
నిర్విరామంగా కాంతిచక్రం తిప్పుతుంది;
ఆ చక్రం
సర్వత్రప్రసృష్టపరమైన
చైతన్య వర్ణవాక్ చిత్రాలు సృష్టిస్తున్నది;
అక్కడ
అనంతమే ఆధారభూతమైన
సౌభ్రాత్రయోగంతో
నేను
ఆత్మ—ప్రకృతుల
శరీర వర్ణాలను ఆవిష్కరిస్తాను
ఒక తల్లిగా – ఒక కవిగా.

## COMPETITION

I felt the movement of my body
Like a professional dancer,
Drunk with its own beauty,
Neglecting mind and soul.

Mind, always ignoring both,
Arrogant with knowledge,
Flying in philosopher's heaven,
Left soul and body.

Soul, sad for their conceit,
Longing for harmony,
Cried : "If I leave now,
Neither of you will exist.
I am Life, and you
Its shelter. Beauty matures
By moving together."

Competition was suddenly over
When the ego disappeared.

# స్పర్థ

మనస్సునా ఆత్మనా ఉపేక్షిస్తూ
వాదేహం
తన సొగసు చూసుకొని తానే మత్తెక్కి
నర్తనమే నృత్తత్వమైన నర్తకిలా
ఊగాడడం నేను గ్రహించాను.

మనస్సు
విజ్ఞానంతో విర్రవీగుతూ
తాత్త్విక స్వర్గంలో తేలిపోతూ
ఆత్మనూ దేహాన్ని నిర్లక్ష్యం చేస్తూ
వాటిని వదిలి వేసింది.

ఆత్మ
దేహం-మనస్సు దురహంకారానికి విచారిస్తూ
వాటితో సామరస్యానికై
తహతహలాడుతూ
"నేను ఇక వెళ్ళిపోతే
మీలో ఏ ఒక్కరూ మిగలరు;
నేను ప్రాణాన్ని
మరి మీరో దానికి ఆశ్రయం;
అందరం కలిసి మెలిసి ఉంటేనే
అందరి అందం విలసిల్లుతుంది" అంటూ
ఎలుగెత్తి హెచ్చరించింది.

అహం అదృశ్యమై పోగానే
అకస్మాత్తుగా
స్పర్థ అంతరించింది.

## EVERYONE'S

Clouds are gathering seeds
Of this moment. It is raining.
It is raining. My past is
Sprinkling down in a fine mist;
Sombre memories, a melody
Ringing in my ear, sung by
Another in my past. Today,
It is singing within me.
That song was someone else's
And everyone's. Whole centuries
Have been played and set free
On the waves of life.
The durance of its traveling
Has no age. It meets a traveler,
Fills him with an agitation that
Stirs past and present memories;
That melody is the voice
Who invites death before the Truth.

# ప్రతి ఒక్కరిదీ

ఈ వర్తమాన దినాలు
కారుమబ్బులు పేరుస్తున్నవి.
కురుస్తోంది వర్షం
వర్షం కురుస్తోంది.
నా గతం
కోమల హిమతుషారమై
కురుస్తున్నది;
విషాదస్మృతులు
నా గతంలో ఎవరో పాడిన
మధుర మోహన గానంగా
నా చెవిలో మ్రోగుతున్నాయి.
నేడు
ఆ గీతం నాలో వినవస్తున్నది.
ఆ పాట
ఏ ఒక్కరిదో అయినా
ప్రతి ఒక్కరిదీ.
శతాబ్దాలను శ్రుతిచేసి
జీవనతరంగాల మీద వదిలేసిన
పాట అది.
దాని యాత్రకు
కాల పరిమితి లేదు.
తాను ప్రతి జీవయాత్రికుణ్ణి
కలుసుకుంటుంది;
అతనిలో అలజడి లేపి
భూతవర్తమాన స్మృతులను రేకెత్తిస్తుంది;
సత్యాన్ని చేరమంటూ
మృత్యువును ఆహ్వానించే పాటయే
ఆ శ్రావ్య సంగీతం.

## ONLY WITH YOUR LOVE

Mother, only with your love
Have we held, for a moment,
This universe. Grief put on
Its farewell robes so that we
Were lightened, reaching
The heights, the Gate of God
Where the source of life
Flowing within us delivered
From shivering from inherited
Sins of the unknown past.

# నీ ప్రేమే ఆధారంగా

అమ్మా !
నీ ప్రేమే ఆధారంగా
ఈ విశ్వాన్ని
క్షణకాలం
మాదనిపించుకున్నాం.
విషాదం
తన వీడ్కోలు దుస్తులు ధరించింది;
ఉన్నతోన్నత దైవ ద్వారం
తెరవడానికి వీలుగా
మా భారం తగ్గించింది;
ఆ దైవద్వారం వద్ద
జీవన మహాశక్తి
మాలో ప్రవహిస్తూ
మమ్మల్ని భయకంపం నుంచి
తరతరాలుగా మాకు సంక్రమించిన
పాపాలనుంచి
విముక్తుల్ని చేసింది.

## THE TEARS OF BLINKING LIDS

I traveled
Towards the sky in the night.
A bucket of water in hand,
To gather
The light of your stars,
And I drank from its mirror
The tears of blinking lids.
And felt the grief of your heart
Dripping in their eyes
I rose in your spaces
To gather your will
With your harvesters.
I sifted the goodness
Of your seeds
On the sleeping womb
Beneath the veil of the world.
So that by its dryness
It would not burn
The heart of your sky.
I apporached you
From your worried world
By turning to a love
In your palm.
To bring a smile
On the cheek of your soul.
That was the moment
The lamp of my birth
Was sparked by you.
Now it is I who sob.
The scenes of dust
Dispelling dust.

# రెపరెపలాడే రెప్పల కన్నీరు

రాత్రివేళ
నేను నింగివైపు పయనించాను
నీ నక్షత్రాల వెలుగుల్ని
ప్రోగు చేయడానికి
నా వేలితో నీటిపాత్ర పట్టుకొని;
ఆ నీటి అద్దంలో
రెపరెపలాడే రెప్పల కన్నీరు త్రాగాను;
ఆ చుక్కల కళ్లల్లో
బొటబొట కారే
నీ హృదయావేదనను గ్రహించాను—
నీ పంట ప్రోగుచేసే వాళ్లతో కలిసి
నీ సంకల్పాన్ని సేకరించడానికి
నీ రోదన కేదారంలో తేలిపోయాను—
నీ విత్తనాల నాణ్యతను
మహీతలపు మట్టి పొరల క్రింద నిద్రించే
గర్భకోశం మీద పరీక్షించాను
ఎండిపోయిన ఆ కడుపు
మండిపోయి
నీ ఆకాశపు గుండెకాయను
నాఢిప్పవేయకుండాని—
నీ అంచెలిలో ప్రేమనై పోయి
నీ ఆత్మవదనం మీద
ఆనంద మందస్మితం వెలిగించడానికే
ఈ నీ వ్యాకులిత రోదయింది
నీదరి చేరాను—
ఆ క్షణమే
నీవు నా జీవిత జ్యోతిని వెలిగించావు
మరి ఇపుడు వినిపించేది నేను— --
ధూళిని ధూళి దులుపుతున్న
దృశ్యాలని.

## FOR YOU, MY CHILD

When the morning dew descends
On your carnation, I will be there.
For your night of sweet sleep,
I will become the lullaby.
For your beautiful flying dreams,
I will be the pushing breath.
I will become the sweetness
And the love speaking as you too
Caress your child in your arms.
I will become the unseen power
To lift the burden of your pain.
I will be unlimited waves
Of happiness to keep your smile
Forever on your face.
I will be the dove who brings
The answer to your prayers
For you, my child,
My Life...

# ముద్దుబిడ్డా! నీకోసం

నీ ఎరుపు బుగ్గల మొగ్గల మీద
ప్రభాత హిమబిందువులు
రాలినప్పుడు
నేనక్కడ ఉంటాను—
నీ మధుర నిద్రా విభావరికి
నేను లాలిపాటనై పోతాను—
నీ ఉజ్జ్వల సుందర స్వప్నాలకు
సహాయక ప్రాణవాయువునై పోతాను
నీ ఒడిలోని విశ్వము
నీవు
పలకరిస్తుంటే ముద్దాడుతుంటే
మధురిమగా ప్రేమగా
మారిపోతాను నేను—
నీ బాధా భారాన్ని తొలగించడానికి
అగోచర శక్తినై పోతాను—
నిరంతరం
నీ మోముపై
దరహాసరేఖలు విరియడానికి
అనంతానంద ఝరులై పోతాను నేను—
నీ ప్రార్థనలు
ఫలాలు కానిచ్చే
పావురాయి నవుతాను
ఓ ముద్దుబిడ్డా! నీ కోసం—
నీవే నా ప్రాణం!

## A DROP OF WATER

An empty pitcher in my hand,
I watch its spilled water—
Efforts of my dreams
Dissipated all in vain.
Lulling myself. I sing in my pain.
Offer me but a drop of water.
I thirst in sorrow.
My friend. I beg you.
My heart is burning.
An incessant furnace. Pass.
Pass me your pitcher full.
Then retrieve it.

Do not be negligent of me.
Let the rim of your pitcher
Approach my parched lips.
Abandon me not in the middle
Of both fire and pain.

My hopes have dispersed
With your vanished footprints;
And the stormy waves of my heart
Struggle with the brief moment
At my command.

Now, forced to fill
The empty pitcher
With the deluge of my eyes,
A thirsting desire presents
My picture for you alone.

It is certain the pitcher
Will remain on the rim
Of the road I trod;
As this world whirls,
Our footprints will mingle.
You will know the ultimate
Thirst of everyone on Earth;
And I one of them.
Keep your heart aware and
The fountain of your love flowing
Generous as I to you...

# ఒక్క నీటిబొట్టు

నావేంటో ఖాళీ కూజా
అందులో మంచి
ఒలికి పోయిన నీటిని పరికిస్తున్నాను—
కలల యత్నాలన్నీ
నిష్ప్రయోజనమై వమ్మైపోయాయి.
నన్నునేను ఉదారుణ్ని అంటూ
దాహార్తున్నై పడుకొంటున్నాను.
నా కోసం నీటిబొట్టు అందించు—
నేను దప్పిగొన్నాను దుఃఖంతో.
నేస్తం! నిన్నర్థిస్తున్నాను;
నా గుండె మండుతోంది అడవి కాలిమిలాగా.
అందించు, నీ బిందుకూజా నాకు కాస్త అందించు
తిరిగి తీసుకుందువుగాని తర్వాత—
నన్ను ఉపేక్షించి ఉండకు
నా ఎండిపోయిన పెదాలను నీకూజా అంచు తాకనీ.
ఆవేదన-అగ్ని ఈ రెంటి మధ్య నన్ను వదిలేసి పోవద్దు.
నీ వెడలిపోయిన అడుగుజాడల వెంటే
నా ఆశలు చెదిరిపోయాయి;
నా ఎదలో లేచిన కల్లోల కెరటాలు
నాకు మిగిలిన క్షణం క్షణంతో పోరాడుతున్నాయి.
అప్రతిహతంగా పొంగే నా కన్నీటితో
నా ఖాళీ కూజాను నింపుకొనే అవసరం లేనందున
ఆ దాహపు కాంక్షయే నారూపంతో
నీకు మాత్రమే కనిపిస్తున్నది.
నేను నడిచిన ఈ దారి అమున్నా
ఈ కూజా ఉండిపోతుంది- ఇది సత్యం;
అయితే, ఈ లోకం గిరగిరా తిరుగుతుంటే
మన పాదముద్రలు కలిసిపోతాయి.
ఈ భూమ్మీద ప్రతి ఒక్కరి చిట్టచివరి దాహం
నీవు తెలుసుకొంటావు-వారిలో నేనూ ఒకడిని.
నీ హృదయాన్ని నెలవులో ఉంచు;
ఉదారంగా నీ ప్రేమ ఊట జాలువారే
నేను నీకడకు సాగుతున్నట్లుగా—

## WITH THOSE LIGHTS

My child, may stars and stars
Flame on the road
Of your dreaming soul.
From the doors of Seven Heavens,
May diamonds be scattered
On your path;
And with those lights,
May your shimmering dreams
Be transformed by
The beauty of Reality
On the throne of your Life.

## ఆ ప్రభలతో

బిడ్డా!
కలలు గనే నీ ఆత్మ
పయనించే బాటపై
లెక్కలేని చుక్కలు
మిలమిల మెరయుగాక!
నవ్య స్వర్గద్వారాల నుండి
నీదరిలో
రత్నాలు వెదజల్లబడియుండుగాక!
ఆ ప్రభలతో
చిరవాంఛితమైన నీ స్వప్నాలు
నీ జీవితసింహాసనం మీద
సత్య సౌందర్యోద్దీప్త
రూపం పొందుగాక!

# CAROUSEL OF ACHIEVEMENT

From my childhood until today,
I hear the never-ending melody
Of a carousel. I decided to build
The carousel of my life;
And the wheel which was turning
Wtihin me to the four corners,
Where the empty seats were waiting,
Made me sit in each of them.
The loneliness of the carousel
Where the future was a null
Called me to invite the love,
The smile, the words and the sharing;
And I decorated the seats with them.
I brought the flute, inventing
Sweet melodies. Often I played
With the sound of running brooks.
The artist, with her brush in hand,
I asked to call the sunrise together;
And with the blood of a pen firmly held,
I was writing the feelings of many lives.
We were turning toward Galaxies
Where godly beings were pouring
The rain of the heart's nobility.
Around me were the friends I had gathered
And my soul was full with joy. Then
I heard the angels say, "Be high
And bring others higher." Today,
My carousel is the well of the Creator
For digging together and pulling the rope
That brings beauty out of the veiled face of a rock.

# విజయ వర్ణచక్రం

నా బాల్యం నుంచి నేటిదాకా
వింటున్నాను
వర్ణచక్ర నిరంతర మధుర నిక్వాణం.
నేనూ నా జీవిత వర్ణచక్రాన్ని నిర్మించుకోవాలని
నిశ్చయించు కున్నాను;
అయితే, నాలోనే ఒక చక్రం ఉంది
అది నాలుగు మూలలా తిరుగుతోంది;
అక్కడ ఎదురుచూస్తున్న నాలుగు ఖాళీ పీఠాలమీద
నన్ను కూర్చోబెట్టింది ప్రతి ఒక్క దానిమీదా.
కావ్యమే ధారగా పెగిలిన ఆ వర్ణచక్ర ఏకాంతం
నన్ను ఆవేశించింది
మమతను, మందస్మితాన్ని
పలుకరింపునూ, పంచుకోలుతనాన్ని పిలుచుకున్నాను;
అలాగే వాటిని ఆ పీఠాలమీద అలంకరించాను.
నేనొక వేణువుని పట్టుకొని వచ్చాను రమణీయ రాగాలు సృష్టిస్తూ.
జలజల పారే సెలయేళ్ళతో శ్రుతికలిపి
అనేకగా ప్రయోగించాను ఆ మురళిని.
కుంచె చేతపట్టుకున్న చిత్రకారిణిని అడిగాను
ఇద్దరం కలిసి అరుణోదయాన్ని ఆహ్వానిద్దామా అని;
గట్టిగా పట్టుకొన్న నా కుంచెలోని రక్తంతో
నేనేమో అనేక జీవితానుభూతుల్ని ఉత్కీర్ణించసాగాను.
ఉదయతారంవైపు తిరిగిపోసాగాము మేము;
అక్కడ దివ్యమూర్తులు
హృదయోదాత్తకిరణాన్ని కురిపించసాగారు.
నాకు కలిగిన సెచ్చెలులందరూ నా చుట్టూచేరి ఉన్నారు;
నా ఆత్మ ఆనందభరితమై పోయింది.
"పైకిరా, అందరిని అంతకంటే పైకి తీసుకురా"
అంటూ అప్పుడు దేవదూతలు ప్రవచించడం విన్నాను.
నేడు నా వర్ణచక్రం
ఆ సృష్టికర్త నిక్షిప్తనిధి;
దాన్ని అందరం కలిసికట్టుగా త్రవ్వుకొని
అనుకంపిత శిలాముఖం నుండి
సత్యసౌందర్యాన్ని చేదుకుందాం.

## MY PRAYER FOR YOU

I pray for you
For today, and tonight
For every footstep
Of my life
Until my death,
And beyond, behind my death.
I would take your burden
On my wings, take it so high
Behind the stars—that even
The shadow of it
Would not touch you,
And you would feel light.
From heights, I would send you
Blue to wear in its purity
With a new prayer
That you too
May one day send to another.
Yet, I am praying.

# నా ప్రార్థన నీ కోసం

నీ కోసం ప్రార్థిస్తున్నాను
పగలూ రేయీ
నా జీవితపు అడుగడుగునా
నేను మరణించే దాకా;
మరి ఆపైన
నా మృత్యువు వెనకాల
నీ బాధల బరువును
నా రెక్కల మీద మోసుకొని పోతాను
పైకి పైపైకి
ఆ నక్షత్రాల అవతలికి—
ఎంత ఎత్తుకు ఎగిరి పోతానంటే
ఆ బరువు నీడకూడా
నీ మీద పడజాలదు;
ఎంతో తేలికపడిన
అనుభూతిని పొందుతావు
నీవు అపుడు.
ఆ ఔన్నత్య శిఖరాలనుంచి
నీలిమను నీకు పంపిస్తాను
దాని నైర్మల్యాన్ని నీవు ధరించడానికి;
"నీవు కూడా అలాగే
మరొకరికి మరొకరికి పంపాలి"
అనే మరో ప్రార్థనతోపాటు
ఆ నీలిమను పంపిస్తాను.
కాని
ఇంకా నేను ప్రార్థిస్తూనే ఉన్నాను.

## THE WINE OF MY RIPE FRUIT

Tonight I drank pain
From the rim of your eyes
Where my stagnant blood mingled
And regulated the beat of love.
I felt, with the rain of your
Cloudy sky, the fainting——
The plea of burning candles
And the incense of your love altar.
The grief of immaturity made me
Walk from spring to summer. Now,
With the wine of my ripe fruit,
I come to age in your love barrel
So that every day of your life
You taste my love in sips.

# నా పండిన ద్రాక్షఫలావనం

ఈ రేయి
నీ కనుల అంచుల నుంచి
నేను బాధను పానం చేశాను;
అక్కడ
పేరుకు పోయిన నా రక్తం
నా ప్రేమవృందవనతో కలిసిపోయి
దాన్ని నియమబద్ధం చేసింది.
మబ్బుక్రమ్మిన నీ ఆకాశం
వర్షిస్తుంటే
నేను పొందిన మూర్ఛనతో
వెలుగుతున్న మైనవ్యత్వం విశ్లిష్టి
నీ వాత్సల్యోపేత సుగంధ ధూపం
నాకు అనుభూతమైనది—
అపరిణతావేదన నన్ను
వసంతంనుంచి నిదాఘానికి
నడిపించింది —
ఇప్పుడు
నా పండిన ద్రాక్షఫలావనంతో
పరిపక్వం కావడానికి
నీ ప్రేమ ఖండంలోకి వచ్చాను
నీవు అనుదినం నీ జీవితమంతా
నా ప్రేమను అంతి అంతిగా
రుచి చూస్తావని.

## MY TODAY

Today my lips still
Shivered
From the sudden visit
Of your zephyr caresses.
The melodies of your love rain
Melted the snow of my heart.
From afar, a bird trilled,
A bird trilled.

Today my lost spring
Clothed as a bud
Appeared.
So hot
Was the breath of my heart
That it quickened the bud,
And my lips, opened by you,
Kissed it,
Buried in the dream
Of magic leaves.

Today my heart
Caresses your rose,
Caresses your rose.

# నేడు నాది

నీ కోమల మంజులస్పర్శంతో
నా అధరాలు
ఇంకా కంపిస్తూనే ఉన్నవి నేడు.
నీ ప్రేమ వర్ష హర్ష రాగాలాపాలు
నా హృదయస్థ హిమాన్ని
కరిగించి వేశాయి.
దూరాన
ఒక పులుగు ఎలుగెత్తింది
ఎలుగెత్తింది ఒక పులుగు —
నేను కోల్పోయిన వసంతం
నేడు
మొగ్గ రూపం ధరించి ప్రత్యక్షమైంది.
నా గుండెగూటి ఎంత నేడో
ఆ అరవిరి అత్యంత చైతన్యం పుంజుకుంది
నీవు విప్పిన నా పెదాలు
ముద్దాడాయి దాన్ని.
మాంత్రిక చిత్ర స్వప్నంలో
మునిగిపోయిన ఆ కోరకాన్ని
నేడు నా హృదయం
నీ గులాబిని హత్తుకుంటున్నది
హత్తుకుంటున్నది నీ గులాబిని.

## AURORA

At dawn, open
With hope, your feathered
Kisses caressed my eyes
And opened them.
In your arms the world
Was beautiful; I gazed
Into your essence
In the depth of your eyes.
You wanted, with the sun's rays,
To watch the games my face
Played with your heart. There
My hair spread like a fan
On your chest, I became
Coquettish, the slave of your love;
A love so sweet that I would
Turn to its warm breath the fruit
Of my flesh—and I knew I was prey
Of the hunter who took
Without breaking the wings of the bird.

# అరుణోదయం

ఆశతో ఆరంభమైన
అరుణోదయంలో
నీ మృదులమైన ముద్దులు
నా కళ్ళను అద్ది తెరచాయి—
నీ పరిష్వంగంలో
లోకం సౌందర్యోపేతమైంది;
నీ కళ్ళలోతుల్లో
నీ వ్యక్తిత్వమూలాన్ని చూశాను
తదేకంగా—
నా వదనం నీ హృదయంతో
ఆడిన కేళీక్రీడల్ని
ఉదయభాస్కర కిరణాలతో
పరికించాలనుకున్నావు నీవు.
నీ ప్రేమదానిపై
నేనాడిన సరససల్లాపాలలో
నా శిరోజాలు నీ వక్షం మీద
వీవెనలా వ్యాపించాయి;
ఆ ప్రేమ
ఎంతటి మధురమధురమో!
నా దేహాన్ని ఒక పండులా
దాని కవోష్ణశ్వాస వైపు త్రిప్పాను—
రెక్కలు విరగ్గొట్టకుండా
పక్షిని పట్టుకొనే వేటగానికి
నేను ఆహారం అయిపోయానని
తెలుసుకున్నాను.

## THE ECHO OF MY HEART

The wounded echo
Of my lonely heart
Journeyed
A vast distance
Without returning,
As if my last tear
Had strangled
The breath of my voice.
In silence,
It was the agony
Of hope's lamp.
Suddenly,
You bore the tidings
Of your presence,
Incorruptible light,
When as a pilgrim,
You tapped on the door
Of my heart's cottage.

# ఎద మారురొద

గాయపడిన
నా
ఒంటరి ఎద మారురొద
ఎంతో దూరం ప్రయాణించింది
తిరిగి రాకుండా,
నా ఆఖరి అశ్రుబిందువు
నా గొంతు ఊపిరిని
పిసికేసిందేమో!
నిశ్శబ్దంలో అది
నా ఆశాజ్యోతి ఆవేదన.
పంకిల పరవళ్ళాలని ప్రభవై
హఠాత్తుగా
నీ రాక తెలిపావు
తీర్థయాత్రికుడి వలె
నా హృదయ కుటీర ద్వారాన్ని
నీవు తట్టినవ్వాడు.

## THE TRAVELER OF MY LIFE

I search you
So that I might share
The extent of my joys
And sorrows,
Like a river tumbling
Toward the sea.

I hold you
Until your warmth
Irrigates my desire
Like the sun
The heart of our land.
I love you
As the traveler
Of my dreaming life.

I follow you
As the night
Will pursue the day.
Till my lips
Touch your lips
Where love's silkworm
Nets the silk of our unity.

## నా బ్రతుకు బాటసారి

సాగరం వైపు దొరలి పోయే
స్రవంతిలాగ
నిన్ను అన్వేషిస్తున్నాను;
నా మోదాలనూ ఖేదాలనూ
నీతో పంచుకోవాలని
నిన్ను గవేషిస్తున్నాను.
భానువు పుడమి గుండె పండించినట్లు
నీ ఆత్మీయతతో
నా అభీష్ట సిద్ధి కావించే దాక
నిన్ను వదలను! వదలను!! వదలను!!!
కలలు కనే నా బ్రతుకు బాటసారిగా
నిన్ను ప్రేమిస్తున్నాను.
పగటిని రేయి వెన్నంటినట్లు
నిన్ను నేను అనుసరిస్తున్నాను
నా మోవి
నీ మోవిని
స్పృశించే దాక
ఆ అధరాలపై
వలపుల పట్టుపురుగు
మన కూడలి పట్టుగూడు
అల్లి పెట్టేదాక!

## SHIPS PASSING BY NIGHT

While stars twinkle
In celestial height,
People neglecting nature for the night
Enjoy themselves deep in the ship.

Ignoring struggles toward the waves,
With a great promise in its silence
In a majestic parade,
Without complaint the ship passes by night.

Passengers dancing on champagne
Forget their pain;
But carrying all those on its shoulders,
Vigilantly, the ship passes by night.

Those borrowed burdens are shared,
One by one, with its partner the sea
To smooth its will. While passing,
The ship flirts with night and sea.

Ships, similar by chance,
Like strangers occasion to meet.
Creak the wind moans through canvas
As ships give respect, passing in the night.

## THE FIRST LOVE

In the beginning
Of your life's spring,
I brought jasmines, carnations
And waterlilies. I put
The bouquet in your hands.
They flourished with you—
The innocent flower of Spring
With your sweet, soft smile.

When I found you in that bouquet,
I felt the difference anew.
With your look of lighted beauty,
Rays beamed like burning stars.
I had not yet brought you my rose
So love would not speak
Too suddenly.

I want you to remain unreachable,
That only I may hold you,
My angel. I don't want other hands
On your lighted face. Let me
Approach you, the breath pulsing
In my chest, the warmth of my kisses
On your lips, the first love opening
The young doors of your heart.

# తొలి వలపు

నీ జీవిత వసంతోదయంలో
మల్లెలు, మొల్లలు, కలువలు
కూర్చి తెచ్చాను.
ఆ పుష్ప గుచ్ఛాన్ని
నీ చేతికందించాను.
మధుర మంజుల మందస్మితుడవైన
అమాయిక కుసుమ వసంతానివి నీవు;
నీతోపాటే ఆ ప్రసవాలూ
ప్రవర్థిల్లాయి.
ఆ పూల గుత్తిలో నిన్ను చూచినప్పుడు
నీలో సరిక్రొత్త మార్పు గమనించాను.
తేజరిల్లిన నీ సుషమ రూపంలో
మెరిసే నక్షత్రాలవలె
కాంతిపుంజం ప్రసరించింది.
అప్పటికింకా నేను గులాబీని తీసుకురాలేదు—
మరి ప్రేమ అంత త్వరగా అభివ్యక్తం కాదుగదా!
నీవు అందరాని వాడివిగా ఉండిపోవాలని
నేను మాత్రమే నిన్ను పొందాలని
ఓ నా సుందర మూర్తీ!
నేను ఆకాంక్షి న్నాను.
ప్రకాశించే నీ ముపై
పరదావస్త్రాలు సహించను;
నన్ను నీదరి చేరనీ;
నా ఉరములో ఊపిరి ఉరకలు వేస్తుంటే
నీ పెదవులపై నా ముద్దులు వెచ్చదనం కురిపిస్తుంటే
నా తొలి వలపు
నీ ఎదలోని క్రొత్త తలపులు తీస్తుంటే
నీదరి చేరనీ నన్ను.

## THE HONEYMOON

You,
As the night,
Held my burning stars
In your breast
And like a meteor,
My sliding pulse arced
With my imagination
Into your bosom.
I was bursting
With the repture
Of that embrace
In the moment
Of the honeymoon,
And seeing the turning
Of your mystical beauty
In which my wholeness
Was rolling.
Oh it was wet,
Tears of the body,
Enfolding each other,
We were swimming
As the lonely lovers
Of the universe.

# శోభన వేళ

రాత్రి మాదిరి
నీవు
నా మెరిసే దృక్కుల చుక్కల్ని
నీ గుండెలో నిలుపుకున్నావు;
ఉల్కాపాతం వలె
జారిపోయే నా వాడి
చూపరేఖావళంలో
నా ఊహతో పాటు
నీ హృదంతరాల వ్రాలిపోయింది.
ఆ పరిరంభణ పారవశ్యంలో
మేము పొంగి పోయాగాము;
ఆవిష్కృత మౌతున్న నీ
మార్మిక సౌందర్యాన్ని దర్శిస్తూ
అందులో నా సర్వస్వమూ దొరలి పోతుంటే
ఆ నా దివ్య శోభన వేళ
మేము పొంగి పోయాగాము.
ఆహా! ఆ నెమ్మగింత!
ఆ ఒడలి జిన్నరు!
ఆ అన్యోన్యాలింగనం!
విశ్వ ప్రేమికుల ఒంటరి జంటూరి
ముఖం ఉదుకుంటూ పోయాం.

## THE WEDDING OF MY HEART

It is night.
Three lanterns burn
Before a hanging wooden cross.
Kneeling I repeat
The prayer of my confession.
On my abstract journey,
The kiss that confronts
With my burning lips;
I spell out your name.
My heart, storm bitten
With your love's joy
Adopts your three syllables.
Holding them
Before the lanterns,
She marries them with my name.
It is wedding of my heart,
And my prayer
Is the witness of my lips
That secretly repeat them.

# నా హృదయ కల్యాణం

అది రాత్రివేళ—
వెలుగుతున్నాయి మూడు లాంతర్లు
వ్రేలాడుతున్న కొయ్య శిలువ ముందు.
మోకరిల్లి వల్లించాను నేను
యథార్థ ప్రకటనాత్మక కీర్తన.
నా భావనాత్మక యాత్రతో
తపించే నా మోవిపై
అద్దిన ముద్దవరిదంటే
నీ పేరే చెపుతా !
నీ ప్రేమానందపంచలితమైన నా హృదయ
నీ అక్షరత్రయాన్ని స్వీకరిస్తుంది.
ఆ మూడు లాంతర్ల సమక్షంతో
వాటికి నా నామధేయానికి
మూడుముళ్ళు వేస్తుంది.
అదే నా హృదయ కల్యాణం;
గుట్టుగా
ఆ అక్షరత్రయాన్ని వల్లించే
నా పెదవులకు
నా సంకీర్తనమే సాక్షి.

## THE MOTIONLESS TWINE

I knew you.
With the tears of my joys,
I filled the cup of happiness
With love
In which I saw again
How each of our particle bodies.
Dancing in shivers,
Were attracted by the clay.
Proving the covering of the soul.
And wetted with sweat
Mingled passion.
There I saw
Our eyes
With ashening fire
Like the eyes
Of a peacock's tail,
Fan and close.
Motionless,
I poured in ripples unending
My cup.
There where our
Fiery eyes,
And our hearts
Weaving in steps
To the motion of DNA.
Were picturing
The celluloid
Jell.

# నిశ్చల బంధం

నిన్ను నేనెరుగుదును.
నా ప్రమోదాశ్రువుతో
నా ఆనంద చషకం నింపాను
ప్రేమ పూర్వకంగా.
మన ఇరువురి సూక్ష్మ శరీరాలు
గగుర్పాటుతో వస్తున్నా,
ఆత్మావాహన నిరూపణగా
ముట్టినే
ఎలా ఆకర్షితాలైనాయో
స్వేద సమ్మిళిత ఉద్రేకంతో
ఎలా తడిసిపోయాయో
ఆ ప్రేమలో మళ్ళీ నేను తిలకించాను.
విచ్చుకుంటూ ముడుచుకుంటూ ఉండే
నెమలి పింఛపు కన్నుల్లా
నివురు గప్పిన నిప్పులై
మనసుల్ని నా కరిగించాయి.
నా ఆనంద చషకాన్ని
ఎడతెగని అలలుగా ఒలక బోశాను
నిత్యంగా—
మన ప్రజ్వలిత పయనాలా,
అనువంశిక పదార్థ గతికి
అడుగులు అల్లుకునే మన హృదయాలా
ఎక్కడ
జీవశక్తి కణాముగుల విస్మృత
జీవపదార్థాన్ని చిత్రిస్తున్నాయో
అక్కడ
ఒలక బోశాను నా ఆనంద చషకాన్ని.

THERE IS NO TIME Dr. KNARIG BOYADJIAN



## ABOUT THE TRANSLATOR

**Dr.** J. Bapu Reddy is an eminent poet of India writing mostly in Telugu, a language spoken by 60 million pepole of South India. He published 10 books of original poems including a book of English Poems "In Quest of Harmony". He won the prestigeous award from Andhra Pradesh Academy of Literature in 1971. He was recently awarded the degree of Doctor of Literature (Litt D) HONORIS CAUSA by the World Academy of Arts & Culture at the 7th World Congress of poets held in Morocco. He toured extensively all over the world and was honoured in U K. and U.S.A. He recites his poems beautifully and can often be heard on All India Radio and Television.

Dr. Reddy was born in 1936. He is a post graduate in Economics. He obtained a diploma in National Dovelpment from the Institute of Social Studies, the Hague, He is a member of the coveted Indian Administrative Sarvice-presently working as Executive Director, Tobacco Board, India. He is an Indain Editor for Poet, an international monthly.

VYAVADHI LEDU Dr. J. BAPU REDDY

PUBLISHED BY :

SUKHELA NIKETAN

I.C. 85, Irram Manzil Colony, Hyderabad-500 C04